Mogala Samraattulu.

# మొగల సామ్రాట్టులు

గ్రంథకర్త్రి

ఎ. ఎస్. విజయలక్ష్మమ్మ

A. S. Vijayalakshamma

ప్రకాశకుఁడు

R. G. Paul

ఆర్. జి. పాల్

తిరువళ్లిక్కేణి మద్రాసు

Madras

# FORE WORD

I have been asked to contribute a foreward to the "Mogul Emperors" by A. S. Vijayalakshmi Ammal, and I willingly do as this is the first instance of a History of India in Telugu by a lady who is still a student.

The small hand-book sets forth the history of the Mogul Emperors from Baber to Aurangzeb—the period between 1526 and 1707, in an easy and flowing style. Though the last chapter is headed 'Aurangzeb,' the history is practically carried down up to 1680 only and the remaining events—the conquests of Bijapur and Golkonda and the guerilla war with the Maharattas—events which eventually sapped the Mogul Empire are described in two brief paragraphs.

The book furnishes a very readable narrative of an interesting period of Indian history—very suitable for the use of boys and girls in schools, the Telugu used being of a simple yet grammatical character. I have great pleasure in commending the book to the notice of the Telugu public and of Telugu teachers in schools.

MADRAS,
*March 1923.*

V. RAMESAM.

# విజ్ఞాపన

నా చిన్ననాటనుండియు దేశ చరిత్రాంశములు చదువుటయందుఁ గడు నాసక్తియుండుటంజేసి యప్పుడప్పుడు నాకుని చిన్నపాత్రములను బాలురకత్యంతోపయుక్త మగునటుల వ్రాయవలెననెడి కోరిక పొడముచుండెడిది.

పలుభాషలయందు ప్రౌఢిమగలవారు పెక్కు చరిత్రముల నిదివరకే ప్రచురపఱచి యుండుటంబట్టి వానియెదుట నా యుద్యమ మేపాటిదని యును, సాహసించి గ్రంథరచనకుఁ బూనుకొనినచో నది పరిహాసాస్పదమైపరిణమించునో యనియును విరమించుకొనుట సంభవమగుచుండెడిది.

అట్టి నాయుద్దేశమును నాతండ్రిగారు కనిపెట్టి గ్రంథ రచనకుఁ బ్రోత్సాహపఱచుటచే భరతఖండ సామ్రాట్టులలో "మొగలసామ్రాట్టులు" అను చరిత్రమును పెక్కాంధ్రాంగ్లేయ చరిత్రములఁ బరిశీలించి వ్రాసితిని.

దేశచరిత్రలయందు సాధారణముగ విషయ ప్రణాళికయు కాలనిరూపణమును ప్రాముఖ్యము గాంచును. వానికి సులభశైలి తోడుపడునేని చదువరులకు నుత్సాహకరముగ నుండునని యుద్దేశముతో నాశక్తికొలది నయ్యది నిందుల సమకూర్పఁ బ్రయత్నించితిని.

ఈ చరిత్రముయొక్క వ్రాఁతముగింపు మొదలు ముద్రణాంతమువఱకు సాదరముతోఁ బరిశీలించిన నాగురువులకును పీఠిక (Preface) నుసాదరపూర్వకముగ వ్రాసి దయచేసిన న్యాయమూర్తులగు బ్రహ్మశ్రీ, వేపా-రామేశం పంతులు వారికిని నా యభివందనము లిందుమూలముగ నర్పించుచున్నాను.

ఇది ప్రథమ ప్రయత్నము; కావున నిందెందేని పొరసులు గన్పట్టవచ్చును; చదువరులు సహృదయులై క్షీరనీరన్యాయము ననుసరించి దీనినంగీకరింపఁ బ్రార్థితులు.

మద్రాసు.
ఏప్రిల్, 1928.

ఇట్లు విన్నవించు,
గ్రంథకర్త.

# మొంగల సామ్రాట్టులు



బాబరు (వ్యాఘ్రము).

---

పదునైదవ శతాబ్దము కడపటఁ బ్రపంచమునందంతటను గ్రొత్తమార్పొకటి గలిగెను. మేధానిధులగు నుత్తమ పురుషు లచ్చటచ్చట నుదయించిరి. కొలంబసు హిందూదేశమునకు

మార్గము గనుఁగొనఁబోయి నూత్న ప్రపంచమనఁదగిన యమెరికా ఖండమును గనిపెట్టెను. క్షీణదశ నొందనున్న ప్రాచీ దిశా సామ్రాజ్యమునకుఁ దురుష్కులు విలయకారులయిరి: కళాభివృద్ధియు మతాభివృద్ధియు మహోన్నతదశ నొందఁ జొచ్చెను. పలుమాటలేల? సరియైన ప్రపంచచరిత్ర మీ కాలము నుండియే ప్రారంభించుచున్నది.

ఈభారతఖండమును పరిపాలించిన యన్యదేశ సార్వభౌములలో మొగలుల వంశము సుప్రసిద్ధమైనది. ఈవంశమును స్థాపించినవాఁడు బాబరు. తైమూరులంగు మనుమఁడైన ఆబూసయ్యదునకు పదునొకండుగురు కొడుకులు పుట్టియుండిరి. వారిలో నాలవవాఁడు, 'అమీర్ షేక్ మీర్జ' యనువాఁడు. ఆతఁడు అండిజాన్ రాష్ట్రమునకు రాజయ్యెను. 'కాటక్ నగర్' అనుసుందరీమణి నతఁడు పెండ్లియాడెను. వారిద్దఱికును 1492-వ సంవత్సరమున బాబరు పుట్టెను. 1494-వ సంవత్సరమందు వాని జనకుఁడైన అమీర్ షేక్ మీర్జ కాలగతి నొందెను.

అమీర్ షేక్ మీర్జ, ప్రశంసార్హములగు నడవడికలు గలవాఁడు. తన సచ్చరితముచేతను బ్రజానురాగము వడసి యుండెను. తండ్రి మరణమప్పుడు బాబరు పండ్రెండు సంవత్సరముల వయస్సువాఁడు. అతఁడు బాలుఁడగుటచేఁ బైతృకముగా వాని నాశ్రయింపనున్న ఫర్గనా సంస్థానము, జ్ఞాతుల పాలాయెను. బాబరునకు 'జహీరుద్దీను (సత్యసంరక్షకుఁడు)

ముహమ్మదు' అను పేరుండెను. ఐనను బాబరను నామమే ప్రసిద్ధమైనది. అతని బాల్యమునందు మాతామహుఁడైన యూనిస్ఖానుఁడే జహీరుద్దీను ముహమ్మదుకు బాబరు అను పేరిడెను. అతఁడు 'జ' యనునక్షరముచ్చరింపలేని మంగోలు తెగవాఁడుగాన జహీరనుటకు బదులుగా నీబాబరను పేరిచే నతనిఁ బిలుచుచువచ్చెను.

బాబరనఁగా వ్యాఘ్రము. అతనియెడల వ్యాఘ్రిగుణములు గొన్ని విలసిల్లుచుండినందున దీని నన్వర్థనామమనియే చెప్పనొప్పును. తొల్లి యొకప్పుడు పారసీకము మెసొపొటేమియా, అఫ్ఘనిస్థానము మొదలగు దేశములకు భీకరుఁడై రణవిహారము సలిపి, హిందూదేశమున నాబాలవృద్ధము లక్షలకొలఁది జనులను బశువులవలె నఱికివైచిన వాఁడగు తైమూరులంగు తల్లివంకతాత. పారసీకము, ఆర్మీనియా, ఆక్ససు నదీతీరభూములు, వేయిమాటలేల, హిందూస్థానమున కుత్తరమునందున్న విశాలభూభాగమును భయకంపితముగఁ జేసిన మహోగ్రుఁడగు చెంగిస్ఖానుఁడు తండ్రివంకతాత. ఆమహాశౌర్యనిధుల పేరలక్షణము లితనియందు సమగ్రముగఁ గన్పట్టుచుండినవి.

బాబరు తన బంధువులలోఁ దనయవ్వ నెక్కువప్రేమించుచుండెను. ఆమె తన యౌవనమునందొక్కప్పుడు తన భర్తయొక్క విరోధికిఁజిక్కెను. అతఁడామెను తన సరదారులలో నొకనికిచ్చి, ఇతఁడే నీభర్తయగును పొమ్మనెను. ఆతని మాటల

కా యువతి యప్పుడేమియు బదులు పలుకలేదు. పిదప నాపురుషుఁడు, ఆయుత్తమ వనిత యున్నచోటికిఁ బోఁగా నతనిని దన చెలికత్తెలచేతఁ జంపించెను. తదనంతరమామె యా మృతకళేబరము వీధి కీడ్పించుకొని వచ్చిచేరెను. అప్పుడచటికి తన మగని విరోధియు రాఁగా నతని నీశూర వనితచూచి, 'యూనిస్థానుని భార్యనగు నన్ను మఱియొకని కొసఁగితివి. ఇది న్యాయ విరుద్ధ కార్యమని వానిని దండించితిని. నీవిష్టపడితివేని నన్నుఁ జంపుము' అని ధైర్యముతోఁ బలికెను. ఆశూర వనితయొక్క పాతివ్రత్యమునకును సాహస కృత్యమునకును సంతసించి యావిరోధి తన యుదారధర్మము వినుతికెక్కున ట్లాయువతీవతంసమును పెనిమిటి యున్నెడకుఁ జేర్చెను.

బాబరు తల్లిగారినిగుఱించి మనకంతగాఁ దెలియదు. బాబరు వసింప గృహములేక వనాటనము సలుపునప్పుడును, శత్రుపురములను జయించి సామ్రాజ్యసౌఖ్యము లనుభవించు నప్పుడును, ఒక్కతీరుగానే తన సోదరీమణులయెడలను బిత్రుష్వసలయెడలను దక్కిన బంధువర్గము లోని యువిదల యెడల ననురాగము గలిగి మెలఁగుచుండెను.

హిందూదేశ చరిత్రమునఁ గానవచ్చు సుప్రసిద్ధులగు సార్వభౌములలో బాబరునకుఁ దుల్యుఁడైన ప్రభువుగానవచ్చుటయరుదు. ఎట్టివాఁడును సేవింపఁదగిన గంభీరమైన యాకృతి యతనికిఁగలదు. వచోచమత్కృతియు సర్వసౌలభ్యమును నత

నికి భూషణప్రాయములుగఁ బరిఢవిల్లుచుండినవి. విజ్ఞాన ప్రవరుల హృదయప్రదేశముల ప్రకృతి శాస్త్రమను మాటయే యంకురింపని యాకాలమున, బాబరునకుఁ దనరాజ్యములోని ప్రతిఖగముయొక్కయు మృగముయొక్కయు నోషధియొక్కయు స్వభావ తత్త్వము బాగుగాఁ దెలిసి యుండెను. అతఁడు హిందూదేశమును బ్రవేశించినప్పుడు, ప్రాణివర్గములును వృక్షలతాగుల్మాదులును దనదేశములోనివానికి భేదపడునట్లు కనుఁగొనెను. బాబరు, చక్రవర్తిత్వముచే ప్రసిద్ధిచెందకపోయె ననుకొందము; సుప్రసిద్ధుఁడైన చిత్రలేఖకుఁడుగానో మహాకవిగానో ప్రపంచమునఁ బ్రఖ్యాతికెక్కియుండును.

అమీర్ షేక్ మీర్జాకాలగతినొందగానే బాబరు బాలుఁడగుటచే నతని పినతండ్రులు ఫరగణాలోని విశేష భూభాగము నాక్రమించుకొనిరి. అందులకాతఁడు వెనుదీయక మిగిలియున్న ప్రదేశములో తగినట్టి వ్యవస్థ గలిగించి రాజ్య పాలనము చేసెను. అతనికి బదునైదు సంవత్సరముల ప్రాయము వచ్చినప్పుడు. అనగా 1497-వ సంవత్సరమున తనకోట శత్రు వులకుఁ జిక్కకుండునట్లు బలపఱచి యున్నటులుండి సమరఖండము మీఁదికి దండయాత్ర వెడలి ముట్టడివేసి దానిని పట్టుకొనెను. అప్పుడు బాబరు, అనన్యసామాన్యపరాక్రమము వెలయించుట మెచ్చుకొనఁదగినది. అతఁడు దాదాపుగా నాలుగునెలలవఱకు సమరఖండమును బరిపాలించెను. అట్టితరుణమున జయింపబడిన

రాజ్యములో కొల్లగొట్టుటకు బాబరు తమకనుజ్ఞ యొసఁగలేదని యతని సైనికులందఱును వెడలిపోయిరి. అంతలోనతని జ్ఞాతి సోదరుఁడు జహాంగీరనువాఁడు ఫరగణా ప్రాంతములలోఁ జొచ్చి అండిజాన నగరమును ముట్టడించెను. అప్పుడతని తల్లియు నవ్వయు, బాబరు కాలయాపనము సేయక యిప్పుడే బయలువెడలి రాష్ట్రమునకు వచ్చిచేరవలయునని వర్తమానములు పైపైని బంపుచుండిరి.

అట్టియెడనున బాబరు రోగపీడితుఁడై శయ్యాగతుఁడయ్యెను. తుదకు నాలుగు దివసములవఱకు నతనికి శరీర స్మారకము బొత్తిగ లేకుండెను. సేవకులు నీట నానిన ప్రత్తితో బాబరుకుత్తుక యెండఁబాఱకుండునట్లు నాలుకఁదడుపుచుండిరి. పిదప దైవానుకూల్యమున వ్యాధియొక్క యుగ్రత యించుక తొలఁగి తెలివి తేటలగుపడుచువచ్చెను. అప్పుడు తనరాష్ట్రమన్యాక్రాంత మయినసంగతి దెలియరాఁగా, పాదతాడిత భుజంగమువలె రోజుచు దిటవుఁదెచ్చుకొని లేచికూర్చుండెను గాని, శరీరము నాశ్రయించి యున్న దౌర్బల్యము మాత్రము తొలఁగలేదు. క్రొత్త వెల్లువవచ్చి నిలువనిలిచియున్న ప్రాఁత నీటిని సైతము కొట్టుకొనిపోయె నన్నట్లు ఫరగనా సంస్థానమున కాపదగలిగె నేయని వగచుచు, స్వరాష్ట్ర స్వజనపరి రక్షణార్థము తన యల్పసంఖ్యాకులగు పరివారమువారిని వెంటఁబెట్టుకొని సమరఖండము వదలి పయనమయ్యెను.

అండిజాన్ ముట్టడిని భేదించి స్వరాష్ట్రము కైవశము చేసికొనుటకు మున్నతఁడు పెక్కుకష్టముల ననుభవించెను. నిద్రాహార పరిశ్రమములఁదప్పి గ్రామైక రాత్రముగా సంచరించుచు, మహా గహన గర్భములఁ గ్రుమ్మఱుచు నిలువనీడయుఁ బరుండ శయ్యయు దొరకక శ్రమననుభవించెననుచోఁ బ్రత్యేకముగా నతని కష్టముల వర్ణింపవలసిన యావశ్యకములేదు.

బాబరు దురదృష్టవశమున మఱియొక తడవకును దన ఫరగనారాజ్యమును బోఁగొట్టుకొని యిడుమల పాలయ్యెను. అండిజాన్ నగరమువదలి తొల్లిటివలెనే యతఁడు వనాంతరములఁ బ్రొద్దులు గడపవలసియుండెను; అట్లుండియు 'రాబర్టు దిబ్రూస్' అనెడు స్కాట్లండు వీరునివలెఁ దన శౌర్యోద్యమములకు వెనుదీసినవాఁడు గాఁడు. కొన్నినెలలకుఁ బిదప బాబరున్నటులుండి, తన స్వల్పసైన్యముతో సమరఖండము మీఁది కెత్తి యారాజ్యమును స్వాధీనపఱచుకొనెను.

పిదప, పగవారు బాబరున్నకోటను ముట్టడించి యసదృశశౌర్యము వెలయించిరి. ఈముట్టడి పెక్కునాళ్లవరకుఁ దొలఁగ దయ్యెను. కోటలో దుర్భిక్షముచొచ్చి యందున్నవారిని బాధింపఁగా, వారాకలి కోర్వక కుక్కలను గాడిదలను కూడ తినఁదొడఁగిరి. బాబరునకుఁ బరమ విశ్వాసపాత్రులుగానుండిన వీరభటులలోఁ గొందఱీబాధ కోర్వక, తమ యేలికను జేవదలి పగవారికనుఁబ్రామి పాఱిపోవసాగిరి. తుదకు ధైర్య

ముచేఁ బ్రసిద్ధుఁడైన బాబరుకూడ దైన్యమొంది తన పగవానికిఁదాను బ్రాణముకంటె నెక్కుడుగాఁ బ్రేమించుచుండిన సోదరీమణియగు ఖాన్‌జాడా బేగము నొసంగి సంధిచేసికొని ప్రాణములఁ బరిరక్షించుకొనఁ గలిగెను.

ఇవ్విధముగా బాబరు సమరఖాండము కోటవదలి దుర్దశానిహతుఁడయి రేయింబవళ్లు విరామములేక క్రుమ్మఱుచుండఁగా నతని పినతల్లి పెనిమిటి యతని సైన్యమునకు వగచి తన పరిపాలనములోనిదైన పార్వతీక ప్రదేశమగు 'కూహిసులైమాన్' అనుజిల్లానొసఁగెను. సర్వవిధముల సుఖించుచున్న మహారాజున కీ పార్వతీక ప్రదేశము సౌఖ్యప్రదము గాకపోయినను యీప్రదేశమును జేరుటయే యతని పురోభివృద్ధికి ప్రారంభదశ యనవచ్చును.

అంతట బాబరు ఖిలాత్, గజనీ, గాంధారము మున్నగు ప్రాంతములను పట్టుకొని 1509-వ సంవత్సరమున కాబూలునందు లేచిన దొమ్మి నణఁచివైచెను. మఱుచటి సంవత్సరమే యతని గర్భశత్రువైన ఉజ్‌బేగుల సేనాని కాలగతినొందెను. దానివలన నతనికి ధైర్య మధికమయ్యెను. ఇరానుదేశపు రాజుతోడ్పాటుచే ఉజ్‌బేగుల నోడించి బుఖారా సమరఖండములను 1511-వ సంవత్సరమున తనకై వశమునకుఁ దెచ్చుకొనెను. అయినను ఆప్రాంతములు చిరకాలమతని వశమునందుండలేదు. తొమ్మిదినెలలలోనే ఉజ్‌బేగులు దండువెడలి బాబరుపట్టుకొనిన

ప్రదేశములను జయించిరి. తదనంతరము బాబరు ఇరాణ దేశపు రాజు తోడ్పాటున వానిని తన వశమునకుఁ దెచ్చుటకు చేసిన ప్రయత్నములన్నియు వ్యర్థములైనవి. అంతటితోమానక తన సైనికులే సమ్మెకట్టి తన్నుఁజంపుటకు కుట్రలు పన్నిరి. అది తెలిసి బాబరు 1517-వసంవత్సరమునందు ఒంటరిపాటున నాచోటు వదలి కాబూలునకు పాఱిపోయెను. పంజాబు, వాయవ్యప్రదేశములు, మధ్య హిందూస్థానము, పశ్చిమ విహారము అను నీప్రదేశములకు రాజైన సికందర్‌లోడీ 1516-వ సంవత్సరమునందు కాలగతి చెందెను. ఆతనికి ఇబ్రహీము జలాలు లను నిగువురు కొడుకులుండిరి. వారిలో భేదముపుట్టించి కలహము పెంచిన యెడల స్వేచ్ఛతో తమ మండలములను బాలింపవచ్చునని లోడి రాజ్యమునకు లోఁబడిన సుబేదారు లుపాయములు పన్నిరి. అందులకుఁ జిక్కి ఇబ్రహీము తన తమ్ముఁడైన జలాలును హత్యాసక్తులచేఁ జంపించెను. ఈ యంతశ్ఛిద్రములను దెలిసి బాబరు సమరఖండమునుండి వెడలి భరతఖండమును బ్రవేశించి జీలమునదివఱకుఁ గలప్రదేశమునుజయించి, ఆప్రాంతమునం దొకసుబేదారును నియమించి 1519-వ సంవత్సరమున కాబూలు దేశమునకుఁబోయెను. ఆసంవత్సరమునందే యతఁడు లాహోరును పట్టుకొనవలయునను తలంపున మఱియొక తడవకు దండయాత్ర వెడలి పిషావరు వఱకు వచ్చెను. అయినను, అంతలో విరోధులు తనరాజ్యములోఁ బ్రవేశించి రను వర్తమానము విని

మరలిపోయెను. మఱుచటి సంవత్సరము బాబరు మూఁడవ తడవకు హిందూదేశమున బ్రవేశించునప్పుడు గాంధార దేశము వారు తన దేశముపై దాడివెడలుటచేత మరలి తనదేశమును జేరి మూఁడు సంవత్సరముల పర్యంతరము గాంధారమును ముట్టడించి పట్టుకొనెను. ఈవిజయముచేత బాబరుని కీర్తి హిందూదేశమునం దంతటను వ్యాపించెను. అట్టితరుణమున పంజాబు సుబేదారుఁడైన దౌలత్ ఖానులోడీ తన ప్రభువైన ఇబ్రహీములోడీకి భయపడి బాబరుని తోడ్పాటునుగోరెను. అప్పుడు బాబరు మిక్కిలి సంతోషముతో వానికిఁ దోడ్పడుటకు సమ్మతించి హిందూదేశముచొచ్చి లాహోరునుపట్టుకొని సుల్తానుపురమువఱకుఁ బోయెను. అంతలో దౌలత్ ఖానునకును బాబరునకును మనస్తాప మేర్పడినందున ముందు పోవుటకు ధైర్యము చాలక యతఁ డాచోటు విడిచి మరలి కాబూలు చేరెను.

ఇబ్రహీములోడి తమ్ముఁడైన అల్లాఉద్దీను బాబరు తోడ్పాటును వేడినందున మఱుచటిసంవత్సరము బాబరు తన పుత్రుఁడైన హుమయూనుని బిలుచుకొని అయిదవ తడవకీ హిందూదేశముపై దాడివెడలివచ్చి డిల్లీనగరమునకు వాయవ్యదిశనున్న పాణిపట్టునందు దండువిడిసెను. 1526-వ సంవత్సరము ఏప్రెల్ నెల 21-వ తేది నుభయపక్షములవారికిని పోరు ఘోరముగ జరిగెను. ఇబ్రహీములోడి తనతండ్రి తాతలవలె పరాక్రమవంతుఁడు గాఁడు; ప్రజాపరిపాలనైక దక్షుఁడును

గాఁడు. పసివాఁడగుటచే యుద్ధకళా విశారదుఁడునుగాఁడు. కాఁబట్టి సామంతరాజులందఱు అతనిపైఁ దిరుగఁబడి యుండిరి.

బాబరుసైన్యమందు 12000 వీరభటులును, 700 ఫిరంగులును మాత్రమేయుండినవి. సుల్తాను ఇబ్రహీములోడి సైన్యమున 1000 గజములును, 1 లక్ష వీరభటులునుండిరి. ఆ కురుక్షేత్ర రణరంగమునందు పైనిచెప్పిన దినమున ప్రాతఃకాలమందే యుద్ధమారంభించెను. ఇబ్రహీము శత్రు సంరంభమెఱిఁగి వెనుదీయుటకుఁగాని పైన గవియుటకుఁగాని సైన్యమును క్రమముగా నడపుటకుఁగాని నిలుపుటకుఁగాని నేర్పు చాలనివాఁడు. కావున మధ్యాహ్నవేళకే లోడీసైన్యములు చెల్లాచెదరయి యపరాహ్ణసమయమున సుల్తానుఖండీభూతుఁడై రణరంగమున శూరవారమునడుమ వీరశయన మలంకరించెను.

భటులు, ఇబ్రహీము శిరమునుదెచ్చి తమ యేలికయగు బాబరునకుఁ జూపి విజయము వెల్లడిపఱచిరి. బాబరునకా విజయమువలనఁ గలిగిన సంతోషాతిశయముచేఁ దన యుద్యోగస్థులకును గాబూలులోని తన ప్రజలకును బెల్లుగ బహుమతులను బంచిపెట్టెను దేశచరిత్రము లలంకరించు శూరపుంగవులలో నితనివలె నౌదార్యము గనఁబఱచిన సార్వభౌముఁడెవ్వఁడును లేఁడు. తనరాజ్యమునందలి బానిసలందఱకు స్వేచ్ఛనను గ్రహించెను. తన పుత్రుండగు హుమయూనునకు సకల సద్వస్తు సమృద్ధమైన యొకరాచనగరును, 20000 పౌనులును ఒహా

కరించెను. రణనిహతుఁడయిన గ్వాలియరు మహారాజు కుటుంబమువారు, హుమయూనుగావించిన యుపకారమును స్మరించి, అతని కమూల్యమైన వజ్రమొకదానిని బహూకరించిరి. హుమయూ నా రత్నరాజమును దండ్రిగారికి సమర్పింపఁగా, దాని నాతఁడు పుత్రునకే యొసఁగెను.

ఈరత్నమే మహావిఖ్యాతినొందిన కోహినూరు. ఇది తా నాశ్రయించు సంస్థానములనన్నిఁటిని క్షీణదశకుఁ దార్చుచుఁ బోయి ప్రకృతము లండను మహానగర మాశ్రయించి మన చక్రవర్తిగారి కిరీట మలంకరించు చున్నది, బాబరు, కాబూలులోని ప్రతిమనుజునకును బదునొకండణాలు విలువగల నాణెములను బంచిపెట్టెను. అందలి ప్రభువుల సీమంతినీమణుల కందఱకును ఢిల్లీలోని రూపగర్వితలగు దాసీల నొసఁగెను. విలువగల భూషణాంబరముల ధారాళముగఁ దనవారికిఁ బంచిపెట్టెను.

బాబరు ఢిల్లీసింహాసన మధిష్ఠింపగానే రాజపుత్రస్థానము జయింపవలయునన్న తలంపు కలిగెను. ఆకాలమున మీవార్ రాజ్యమును మహాప్రతాపశాలియగు సంగరాణా పరిపాలించుచుండెను. ఈ సంగరాణా, అత్యంతబలము కలిగి విశాలనేత్రములును గౌరవర్ణగాత్రమును మొదలుగాగల మహాపురుష లక్షణములతో వెలయుచుండెను. ఇతఁడు మహాశూరుఁడగుటచే ఢిల్లీశ్వరుండైన ఇబ్రహీములోడితోను, మాళవదేశాధీశునితోను పదునెనిమిది తడవలు ఘోరముగఁబోరి వారిని బూర్తిగ

నోడించెను. ఇతఁడు తన యన్నతోఁ బోరాడినప్పుడు చేయి యొకటిపోయెను. మఱియొక యుద్ధమందు గుండుదెబ్బచే కాలు విఱిగినది. ఈతని శరీరమున యుద్ధములలోఁ దగిలినగాయముల మచ్చలు ఎనుబది యుండెను. సంగరాణా యొక్కప్పుడు లోడీ పుత్రుని చెఱపట్టివదలెను. ఇతనియొద్ద ప్రచండసైన్యముండెను. ఇతఁడు మేవాడుదేశము పొలిమేరలను బెంచి రాజ్యము విస్తారదశకుఁదెచ్చెను.

ఇట్టి సంగరాణాను జయింపకయే తన ప్రతాపమునకు శోభగలుగదనిదలఁచి, బాబరు 1528-వ సంవత్సరమున నతనిపై నొకసైన్యమును బంపెను. రాజపుత్రులు వారినందఱను నఱకి గూల్చిరి. పిదప బాబరు తానున్నచోటికి రాజపుత్రులు రాకుండునట్లు చుట్టుకందకము త్రవ్వివిడిసియుండెను. పిదప రాణాయొద్దనుండి తనయొద్దకు వచ్చునట్టి రాయబారులను దురాశలు చూపి లోఁబఱచికొనెను. దానివలన రాజపుత్రులు పరాకుగనున్న సంగతి దెలిసి యున్నట్లుండి వారిపైఁబడి పోరి జయించెను. బాబరు సంగరాణాను జయించినచో మద్యపానము చేయుటలేదని సంకల్పించుకొనెను. అటులే తన జీవితకాలమంతయు గడపెను.

ప్రతిశుక్రవారము బాబరు తన బంధువర్గములోని వృద్ధస్త్రీలను దర్శింపఁబోవుట వాడుక. ఒక శుక్రవారము తీక్ష్ణాతప మతిశయించి వేఁడిమంటలువెదచల్లుగాలి మహోగ్రముగ వీచు

చుండెను. అప్పుడు బాబరు ప్రియకాంతయైన మహామ్ (చంద్ర బింబము), "ఈశుక్రవారమొక్క దినము మీరు పోకున్న నేమి? రాణులు మీయెడ గోపింపరే! ఈమండు వేసవిని సంచరించుట చేత నెట్టివారికిని శరీరోపద్రవము కలుగక తప్పదు" అని యా తఁడేగుట నాటంకపెట్టఁజూచెను. అందులకు బాబరు, 'నాప్రియు రాలా! నీవు నోరార నిట్టిపలుకులుచ్చరింపవగునా? నేనీ యెండ కుభయపడి చేవదలితినేని వారిగతి యేమగును? వారికి తలిదం డ్రులున్నారా?" అనెను. మహాము బాబరునకు బదులుపలుక వెఱచి యూరకుండెను.

బాబరు దృఢశరీరి. ఇరు కేల నిరువురు స్థూలకాయుల నెత్తికొని చాల దూరమేగగలఁడు. ఒక్కప్పుడు కాల్పినుండి వెడలి 160 మైళ్లదూరమునందున్న యాగ్రానగరమును రెండు దినములలోఁ జేరగలిగెను. అతనికి హిందూదేశ శీతోష్ణస్థితి సరి పడనందున బలుమాఱు జ్వరపీడితుఁడై వెతనొందుచుండెను. ఆతఁడు నల్లమందు నమితముగా నుపయోగించుచు వచ్చెను.

ఆదిమహైందవ చక్రవర్తులవలెనే బాబరు చక్రవర్తియు మనహిందూదేశమును బరిపాలించెను. ఆతని పరిపాలనకాలము ఐదు సంవత్సరములు. ఆతఁడు అందఱయందును సమదృష్టి కలిగి జనరంజకుఁడై మెలఁగెను. తనప్రజల కోఱ్కెలను గుర్తెఱిఁగి వాని నివర్తింపఁ దనశక్తిని వినియోగించుచుండెను. తన యేలు బడిలోని జనులు సుఖులై యుండవలయు ననెడి తలంపాతనికి

గలదు. తొంటి రాజులవలెనే యతఁడును మాఱువేసముతో పురశోధనమునకుఁ బోవుచుండును. రాజ్యమునందు మంచి వ్యవస్థలుగలిగించి తానేర్పఱచిన చట్టములననుసరించి జనులు నడుచుకొనునట్లు నిర్బంధించెను; వాని నిరాకరించి నడుచుకొనువారిని దిట్టముగ శిక్షించుచువచ్చెను, తన్నిమిత్తమునఁ గొందఱికాతని యందు వెగటుపుట్టి కాలక్రమమున విరోధము హెచ్చెను.

ఒకనాడొకఁడు గంగానది గట్టుపైనిలిచి జలప్రవాహమును తెప్పవాల్పక చూచుచుండెను. వాని పొడుగైన యాకారమును బలిసినయొడలును ముడుతలువడిన మోమును దీర్ఘబాహువులును మహాశూర లక్షణముల వెల్లడిసేయుచుండినవి. వాని శరీరచ్ఛాయ నలుపైనది. వాఁడు తొడిగిన యుడుపులేవానిని రాజపుత్రుఁడని చాటుచుండెను. కాలుకదల్పక నిలుచుండిన యావీరునిఁజూచువారు దీర్ఘాలోచనకు లోఁబడి యున్నాఁడని తలఁపక మానరు. వానియాలోచన యెట్టిది? అది మిగుల ఘోరమైనది; బాబరు చక్రవర్తినిఁ బొరిగొనుట ననుసరించినది. "బాబరు పలువిధముల కట్టుదిట్టముల నేర్పఱచి మనకు స్వేచ్ఛయొసఁగక సర్వదా బాధించుచున్నాఁడు. వీఁడు గెడసిననే కాని మనలోనెమ్మది తలచూపదు. వీఁడుచచ్చిననే దేశమునకు మేలొనగూడును. కాఁబట్టి యెటులైనను వీనినిగూల్చి మఱియొక పనిచేసెదను" అని నిశ్చయించుకొని యందుండి మఱలి నగరములోనికి వచ్చెను. చక్రవర్తిని బొడుచుటచే తనకు ప్రా

ముహమ్మదీయ చక్రవర్తులలో, అక్బరు దేవ సమానుఁడని వేనోళ్లఁ గీర్తింపక తప్పదు. అతఁడు, సర్వమతములయందు నాదరముంచి సహనముతోఁ బ్రవర్తించుటచేత నేకాకనూత్న మత మొకదాని సముద్ధరించెననియు చెప్పియున్నాముగద! అటులుండియు రాజ్య తృష్ణయు స్వాతిశయేచ్ఛయు నతనివీడి తొలఁగి నదిగాదు. అందులకై యతఁడెట్టి రక్కసపుఁబని కైనను సాహసించుచువచ్చెను. ఇందుల కుదాహరణముగా నొకటి రెంటి నిందుఁ దెలిపెదము.

ఆకాలమునందు బుందేల్ ఖండమునందు ప్రఖ్యాతుఁడై ఛందేలురాజు విలసిల్లుచుండెను. ఆతనికి దుర్గావతియనెడి పుత్రికారత్నముండెను. ఆబిడ సౌందర్యసంపద వలెనే సుగుణగణములు దీపించుచుండెను. బంగారమునకుఁ దావియబ్బినటులా రూపవతికి విద్యావివేకములు ననుపమానములై విలసిల్లుచుండెను. యుక్తవయస్కురాలయిన రాకొమరు లామెను బరిణయమాడఁగోరి ఛందేలురాజును వేఁడుచుండిరి. వారిలో నెవ్వఁడును దన పుత్రికకు సాటిరానందున నేదోసాకులుచెప్పి తప్పించు కొనుచు వచ్చెను.

వారిలో శౌర్యౌదార్యములయం దసమానుఁడై గడ మండలములోని గోండులను పాలించు రాచకొమరుఁ డొకఁడు ండెను. వాని,పరాక్రమమునుగూర్చి జనులు వేనోళ్లఁ బొగడుచు డఁగాదుర్గావతివిని యాతనియందు బద్ధానురాగయయ్యెను.ఆ

రాజ్యముచిన్నది; కులమునందును శ్రేష్ఠుఁడుగాఁడు. అనార్య వర్గమును జేరినవాఁడు; అటులుండియు నతనిపలుకు మేలుబంతి మై రాజపుత్రవర్గమునఁ జెల్లుచుండెను. ఒకనాడు గడామండలమురాజు, దుర్గావతిని దనకిచ్చి పెండ్లి సేయుమని ఛండేలురాజును బ్రార్థించెను; ఛండేలురాజు, వానివేడికోలు త్రోయలేక యు తనకూఁతురి యభీష్టముఁ దెలిసియు రెండవమాట చెప్పక యతనికిచ్చి పెండ్లిచేసెను.

ఆసుగుణవారాశి యత్తవారింటికిఁ బోవునప్పుడు, ఆ నగరమందలి బీదసాదులకుఁ దగినట్లు బ్రదుకులు స్థిరపఱచెను. కాఁబట్టి, వారందఱామెను దల్లిగాభావించి యాబిడ యెడఁ బాటునకు మిగులవెతనొందిరి.

గడామండలమురాజు, రాణి దుర్గావతియొక్క సుగుణగణములకుఁజిక్కి యామెయే తన కిహలోకసర్వస్వమని భావించెను. రాజకార్యములయందు విరక్తిఁజెంది యంతఃపురమునందే మెలఁగఁజొచ్చెను. అట్టిమెలఁకువ తగదని దుర్గావతి యుక్తియుక్తములుగ హితము సూచించుచు వచ్చినను, ఆతఁడు 'నేఁడురేఁపు' అని సాకులుచెప్పుచు కొలువునకు పోవుట మానెను. ఇటులుండఁగానే యాబిడయొకపురుషశిశువును గాంచెను. వాఁడు దినదినాభివృద్ధినొంది పదిసంవత్సరముల బాలుఁడగు నరికి నేదోయొకవ్యాధితగిలి వానితండ్రి కాలగతినొందెను. అటుపిమ్మట, దుర్గావతి తనకొడుకునకుఁ బట్టముకట్టి వాఁడు

యుక్తవయస్కుఁడగు నంతవఱకును రాజ్యసూత్రములను దాను వహించెను. ఆమె యేలుబడియందు గడామండల మన్ని విధముల నున్నత స్థితిఁ జెంది యొప్పారెను. ప్రజలు కష్ట ములెల్లఁ బాసి సుఖించిరి. నాలుగైదుసంవత్సరములలో దుర్గా వతిపరిపాలనము మిగులఁ బ్రశస్తమైన దనుమాట హిందూదేశ మునం దెల్లెడలను వ్యాపించెను. ఆమెకీర్తి అక్బరుపాదుషా చెవినిబడెను. "ఒక్కస్త్రీ యెంతనిపుణతతో రాజ్యపాలనము సేయుచున్నది! ఆబిడ నాకుసామంతురాలుగ నుండవలయును. ఒకస్త్రీని లోఁబఱచుకొనకుంటినేని నాపౌరుషమును మెత్తు రా?" అని, రాజ్యకాంక్ష తన్నుతొందరపెట్టఁగా, అక్బరు అసఫ్ఖానుని నాయకత్వముక్రింద నొకపెద్దదండును సమ కూర్చి గడామండలము మీఁదికిఁ బంపెను.

అసఫ్ఖానుఁడు మిగుల సాహసి; స్త్రీతోడి పోరాటము పౌరుషమునకు వన్నె తేదని తెలియక గడామండలమునుముట్టడి వేసెను.

రాణి, తనసైన్యమంతటిని సమకూర్చి రెండుభా ములుగ విభజించి, యొకభాగమునకుఁ దనకొడుకును నాయకు గఁ జేసి, మఱియొకదానికిఁ బురుషవేషము ధరించినతా నాయకురాలయ్యెను. ఇట్లు రెండువైపులను సేనల నడిపిమో వించియున్న విరోధిసైన్యమును దాఁకెను.

మొగల భటులతును గడామండలము శూరులకును పోరు ఘోరముగాజరిగెను. ఉభయపక్షములవారిలోను వీరులు త్రెగి కూలుచుండిరి. జయాపజయము లేవంకను నిర్ణయించుటకు శక్యముకాదయ్యెను. కాఁబట్టి, అసఫ్ ఖానుఁడు, సైన్యబల మెక్కువగా నున్ననే కాని గడ మండలము దక్కదనియెంచి, మఱుచటిదినము గొప్పదళమును సమకూర్చి, తగినమాటలచే వీరరసమునుపూరించి యుద్ధాభిముఖుఁడయ్యెను. అప్పుడు, ఖానుఁడు గడామండలము రాజపుత్రుఁడు పోరుచున్న రణరంగమునకు దిట్టలైన జోదులను బంపి, దుర్గావతి యున్నెడకు స్వయముగా వచ్చి పోరఁజొచ్చెను.

భయంకరముగ రణరంగమునందు బాణములు మొత్తములు మొత్తములుగ పడుచుండినప్పటికిని గడామండలము జోదులు ప్రాణములపై నాశమాని మహాసాహసముతో విరోధులలోఁజొచ్చి కూల్చుచుఁ బోయిరి. మొగలవీరులును దమ ప్రతాపమునకు లోపముగలుగని విధమున మిక్కిలి తెగువతోఁ బోరుసలిపిరి. కొంతసే పిటువైపునను కొంతసే పటువైపునను జయము మాఱుచుండినది. ఇంతలో నొకదళపతి రాణిగారిని జేరి, అమ్మా, ఘోరాహవమందు మీతనయుఁడు బాణము తగులుటచే మూర్ఛిల్లె ననెను. ఆమాటల కాబిడ, "ఆలాగా! ఇది దుఃఖించు సమయముగాదు; వానిని శిబిరమునకుఁ గొంపోయి యుపచరింపుము: నేను శత్రుసంహారముచేసి యచటకు వచ్చెదను" అనెను. వాఁడామె యానతిచ్చినటులే చేసెను.

చక్రవర్తిబలము లమితములు గావునఁ బై పైనివచ్చి క్రమ్మఁదొడఁగెను. వారియెదుట గడామండలము భటులు నిలువలేక కూలుచుండిరి. పగవారు వర్షమువలె బాణములు కుఱిసిరి. రాణి, వానిని లక్ష్యముసేయక వీరవిహారముసలిపి ప్రతిభటులను సంహరించుచుండెను. ఆతరుణమందొక బాణమా వీరవనిత తల నాటెను. దాని నాబిడయే పెఱికివైచినది. రక్తము దేహమంతయు వ్యాపించునట్లు గాయమునుండి స్రవించెను. అట్టి తరుణమందు నామె వెనుకజ్జయిడక ప్రాణములను గొప్ప సేయక పోరఁజొచ్చెను.

ఆతరుణమందు భటుఁడొకఁడు వేగముగా రాణియొద్దకువచ్చి, "అమ్మా, అదిగో విరోధులుమీఁదికి వచ్చుచున్నారు. వారి నాఁగునంత సైన్యము మనయొద్దలేదు; మీరిప్పుడే యీగజమెక్కుఁడు: మిమ్మును సురక్షితమైన యొకప్రదేశమును జేర్చెదను" అనెను. అందులకాబిడ కొంతచింతించి, "ఔను, భటుఁడా నీవన్నది సత్యము. నేను క్షత్రియకాంతను. ముందిడిన పాదము పిఱిదికి మరల్పలేను. విరోధులచేయి తగిలి నా దేహము పవిత్రమగుటకు మున్నే నీవీఖడ్గముతో నాకంఠము నఱకుము; నీకిందువలన పుణ్యమబ్బును" అనెను. అకృత్యమునకు వాఁడు వెనుదీయుటనుగాంచి ఆబిడతానే ఖడ్గముతోఁ బొడిచికొని యుద్ధరంగమునఁ గూలెను.

ఆహా! అక్బరుపాదుషాయొక్క రాజ్యకాంక్ష. గడామండలములోని గోండువీరుల నెందఱను హతముచేసెను! అభాగ్యుఁడు, రాణి స్త్రీనుఁగు విరోధులకుఁ జిక్కకనటు లాకచోటని శ్చేసించెను. దుర్గావతిసమాని జబ్బలపూరునొద్దనున్నది. ఆమె గుణములను గూర్చి వ్రాసియున్న శిలాశాసనమొకటి యచ్చటనేయున్నది. నేఁటికిని ఆవైపుగఁ బోవుప్రయాణికు లామె సమాధిని భక్తిశ్రద్ధలతోఁ బూజించెదరు.

అక్బరుపాదుషా, తనసార్వభౌమత్వము స్థాపింపఁగోరి, రాజపుత్రులనందఱను స్వాధీనపఱచుకొని తనకొలువులో గొప్పయనికారము లొసఁగి గారవించుచు వచ్చెననియును, తన్నెదిర్చినసిసోదియవంశ రాజపుత్ర విరోధవశమున మేవాడు నత్యంతక్షీణదశకుఁ దెచ్చెననియును జెప్పియున్నాముగద! పాదుషాకు భయపడిపాఱిపోయి, ఉదయసింహరాణా, ఉదేపూరును నిర్మించెను. ఆతనిభార్యవీరాబాయి; ఆబిడ, ఒక్కప్పుడు తనపెనిమిటి అక్బరు చేతికిఁ జిక్కఁగా, పురుషవేషధారిణియై తనపేరు సార్థకపఱచుచున్నదోయన పాదుషాతో భయంకరముగఁ బోరి తనపెనిమిటిని విడిపించుకొని వచ్చెను. ఆశూరవనితకు రాణాప్రతాపసింహుఁడు పుట్టెను. ఆతఁడు తండ్రివలెఁ బిఱికిగాఁడు; తల్లివలె శౌర్యధైర్యములతో వెలయుచు, పాదుషాను ముప్పాతిప్పలఁ బెట్టి గుండెకు ముల్లుగ వెలయుచుండెను. ఆతనినిగూర్చి యిచటఁ గొంత ముచ్చటించుట యత్యావశ్యకము.


ణా ప్రతాపసింహుఁడుసింహాసనమెక్కినప్పు
డు, పరిపాలించుటకు రాజ్యములేదు; విరోధు
లనెదిర్చి పోరుసలుపుటకు భటులులేరు; ధన
ములేదు. తన స్వకులమును జేరినవారే
యక్బరునకు లోఁబడి తనకుఁ బ్రబల శత్రువులుగ నుండిరి.
ఏవంకఁ జూచిన, ఇడుమలు మొత్తములై తన్నుమోఁదఁజొ
చ్చెను. తాను విరోధించియున్న పగవాఁడు, సార్వభౌముడు:
అతనికెందును గొఱఁతయన్న మాటలేదు. అసంఖ్య ధనమున
కును, అమిత సైన్యమునకును, అధిక భూభాగమునకును
సామ్రాట్టు! తన విగ్రహ మతనియెదుట నెంతమాత్రము చెల్లు
ను? అతని పూర్వీకులను గూర్చి యేర్పడిన యశోగానము
లతనికిం దన జాతియందభిమానమును దన దేశమునందు భక్తి
యును స్వజనములందు ననురక్తిని పెంచఁజొచ్చినవి. కాఁబట్టి
యే, అక్బరు చక్రవర్తి యెంత యున్నతపదవియం దున్నప్ప
టికి నతనికి గొప్పగాఁ గన్పట్టకపోయెను.

విరోధికి లొంగి, నగరములలో ననేకవిధముల సుఖిం
చుటకంటె నరణ్యావాసమే యానందజనకమైయుండెను. అత
డరణ్యమందు, ఒక్కొక్కవేళ బయలిలో పఱుపులులేక
కప్పుకొనుటకు బట్టలులేక భార్యా పుత్రులతోడఁ బరుండి నిద
రించును. ఒక్కొక్కప్పుడు తినుట కాహారములేక చేతికి దొ
కిన క్షుద్రధాన్యములను మెక్కి బడియసీరుఁత్రావి తనివి

దును. ఆహారముదొరికి తినుటకుఁ గూర్చున్నవేళఁ దన్నుఁ బట్టుటకు విరోధులు వచ్చుచున్నారని తెలిసి, ఆహారము దిగ విడిచి పాఱిపోవును. ఇటులే యతఁడయ్యరణ్యమునం దనుభవించిన యిక్కట్టులు లెక్కకు మిక్కుటములైనవి. ఆతని కష్టములకు శత్రువు సైతము జాలినొందును. ప్రతాపసింహుని కష్టములవిని, అక్బరు, రాణా! నీవు నాకు లోఁబడితివేని నీ రాజ్యమంతయు నీకే యిచ్చివేసి గారవించెదను'' అని యొక వృద్ధుడు వర్తమాన మంపెను. అందులకు "నీకులొంగి నావంశము నకుఁగళంకము కలిగింపనొల్ల''నని బదులుచెప్పి పంపెను. ప్రతాపసింహుని ధైర్యమునుగాంచి, కొందఱు రాజపుత్రవీరులు, తామతనికిఁ దోడుపడకపోవుట కులమునకు ద్రోహ మొనర్చుట గాఁ దలఁచి, అతనితోఁ జేరి విరోధి నెదుర్కొనుటకు సిద్ధపడిరి. తనబంధువర్గములోఁ జేరిన కొందఱు చిన్న సంస్థానాధిపతులు నాశ్రయించిరి.

ప్రతాపుఁడు బహాటముగా విరోధి నెదిరి పోరుసలుపుట వలనఁబ్రయోజనము గన్పట్టదనియును,అక్బరు ప్రచండ సైన్యములను మార్కొనఁదగిన దళములు దనకులే వనియును నెంచి యతని రాజ్యమున క్షుద్రోపద్రవములు పెంచుటకు మొదలిడెను. విరోధిప్రజలు తమ యునికి పట్లనువదలి వనాంతరములకు వలసపోవునట్లు చేసెను. తనయున్నచోట, అనఁగా కుంభల్మీరు గోగుండా యను ప్రదేశములందు దృఢములయిన

ఆతనికి రాణాలుదప్పఁ బ్రబలశత్రువులులేరు. అక్బరు, వారియాశ్రితమును గోరనేకాని వినాశముఁగోరలేదు. వారిని తనకాశ్రితులగు జేసికొని, తన చక్రవర్తిబిరుదము సార్థక పఱచుకొన వలయునను సదుద్దేశమే మేవాడుకువినాశముగలిగించెను. ఇట్లు వారి వారియందలి శౌర్యముదెలిసి యాశ్రయదానమొసఁగు నేర్పు, అక్బరునందు వలె మనవితరులందుఁ జూడలేము.

మురాదు మరణానంతరము, అక్బరు వ్యాకులిత హృదయుఁడయ్యెను. సలీము, ఆతనియిచ్ఛకు విరోధముగామెలఁగి, పాదుషా బిరుదమును వహించి, తండ్రి యధికారమపహరింపఁ బ్రయత్నించెను. అదితెలిసి, చక్రవర్తి హితబోధకములయిన యుత్తరములు తనయునకు వ్రాసెను గాని యట్టిచేఁతవలనఁ బ్రయోజనమేర్పడలేదు. సలీము, తనతండ్రికి బాహ్యప్రాణమనఁదగిన 'అబుల్ ఫాజల్'ను జంపించెను. మిత్రవియోగముఁచే సార్వభౌమునకుఁ జింతయినుమడించెను. ఇటులే, తల్లిచావు దానియల్ మరణము నున్నగు శోచనీయాంశము లొకటివెంబడి నొకటిగా నక్బరునకుఁ దటస్థించుటవలన, చింతలఁజివికి రానురాను శరీరము క్షీణింపఁగాఁ దుదకాతఁడు మంచము పట్టెను.

అక్బరుచక్రవర్తి యవసానసమయమునందు, రాజపుత్రుఁడైన సలీము జనకుఁడున్నచోటికివచ్చి చేరెను. పుత్రసందర్శనమాత్రమునఁ జక్రవర్తియమందానంద హృదయుఁడై ప్రే

మపూర్వకములయిన పలుకులు పలికి వాత్సల్య మగపఱచెను. వెంటనే, 'ఇంతకాలము నాసాహసకృత్యములకును సార్వభౌత్వమునకును నిర్వంచనముగఁ దోడ్పడివిశ్వాస పాత్రులుగ మెలగుచుండిన నాసరదారుల నీ క్షమమునఁజూడఁ గోరెదను; వారికి నీయందును నీకు వారియందును నంతస్తాపము లంకురించి వర్ధిలరాదని నాయభిమతము; అట్టి మీలోని వైరస్యమును నేను భరింపలేను' అనెను.

అక్బరు కోర్కెచొప్పున నాతని సరదారులందఱువచ్చి వందనములర్పించి వినయవినమితాంగులుగ నిలుచుండిరి. అప్పుడు సార్వభౌముఁడు వాండ్రనందఱను గూర్చి సాదరోక్తులు గొన్నిపలికి, ప్రత్యేకముగ నొక్కొక్కనిపై దృష్టిసారించి, 'మీలోనెవ్వనికైన నపరాధిగ మెలఁగి యుంటినేని నన్ను క్షమింపుడు' అనివేఁడెను. అపుడు, సలీము తండ్రి పాదముల మ్రోలఁబడి గోడున నేడ్చెను. అనంతరము, తనచుట్టునున్న పరిజనమును జూచి, 'వీనిని రాజచిహ్నములతో నలంకరింపుఁడు' అని యానతిచ్చెను. అటులే, వారు సలీమునకుఁ జక్రవర్తి యుడుపులు దొడిగి నడుముకట్టున నాక్బరు పట్టపుఖడ్గమును జెరవిరి. పిదప, అక్బరు చక్రవర్తి పుత్రునిజూచి, 'ఇఁకనీవు నా హితమిత్ర పరివారము వారియెడ పక్షమువహించి మెలఁగునది. అంతఃపుర స్త్రీజనమును నభిమానముంచి పోషించునది' అని ఆనతిచ్చి తలవ్రేలవైచెను. ఆ మహనీయుఁడు, అఖు-

పదిమూఁడు సంవత్సరములపై నొక్కదిన మీ ప్రపంచయాత్ర జరిపి, క్రీ.శ॥1605-వ సం॥ము, అక్టోబరు నెల 15-వ తేదిని బర లోకమున కేఁగెను.

హిందూ దేశమును బరిపాలించిన సార్వభౌములలో నద్వితీయుఁడు, హిందూదేశముఁ బరిపాలించిన మొగల సార్వభౌములలోఁ దృతీయ పురుషుఁడు, భండనముల యందసమాన పౌరుషశాలి, పాలనమునం దనుపమాన ప్రతిభానిధి. అక్బరు చక్రవర్తికాలగతినొందెను. అతఁడు, తనవంశజుల కుత్తమ కూటస్థుఁడుగ బరిగణింపఁబడెను. అతని పరిపాలనము, పశ్చిమంబునఁ గాబూలును, హిమాలయ ప్రాంతములందు కాశ్మీరమును దూర్పున బంగాళమును, దక్షిణంబున ఖాన్ దేశంబును గలవిశాల భూభాగములోని మండలములయం దంతటను వ్యాపించియుండెను. ఇట్టి గొప్పరాజ్యమును నలువది సంవత్సరముల దనుక ఘోరముగఁ బోరి సంపాదించుటయేగాక దాని నొక్కవైఖరిగ నొక్కసార్వ భౌమత్వము గ్రిందికిఁ దెచ్చుట కాతఁడు మిక్కుటముగఁ బాటుపడెను. చిన్నజాతులను భిన్నమతములనుగల యసంఖ్యాక జనసముదాయమును సమదృష్టితోఁ జూచుచు పరస్పరానురాగము తోడి సౌభ్రాత్రమును బొందుకొలిపెను. దుర్వ్యసనాసక్తులైన పుత్రుఁడును బౌత్రుఁడును రాజ్యపాలనము చేయునప్పుడు నైతము మొగల రాజ్యము చలింపక నిలుచుటకుఁగారణము, అక్బరు చేసియుం

చిన శ్లాఘాపాత్రములైన పద్ధతులేయగును. ఆతనిమునిమను మఁడైన యౌరంగజేబు, తన పెద్దలమార్గమునకు విరుద్ధముగ మెలఁగుటంబట్టియే సామ్రాజ్యమునకు వినాశము దలచూపెను.

తన ప్రజల నొకతెగ క్రిందికిఁదెచ్చు నిమిత్తమాతఁడెంతో శ్రమపడెను. దానికిఁ బ్రయోజనముగా నతనికిఁబిదప వందసంవత్సరముల దనుక మొగలసామ్రాజ్య వైభవమతిశయమొంది యేరికినిదేరి చూచుటకుగాక యుండినది. అక్బరుదేశ చరిత్రములను జదువలేదు;ఆతనికనుభవజ్ఞానమే చాలినంతగలదు. తనవంశ మీ దేశమున స్థిరముగ నుండవలయునన్న కోరికతో, రాజ్యములోని ప్రజలందఱొక తెగవారుగా నుండవలసినది యత్యంతావశ్యక మగుట యాతని యభిప్రాయము; దానిను ద్దేశించియే 'దినే ఇలాహి' మతమును గల్పించెను. అంతిశ్ఛిద్రముల కాస్పదములేని యొకతెగ జనులనుగల సామ్రాజ్యమన్యదేశములవారి ప్రవేశమునకుఁ జోటొసఁగదని యాతఁడు దృఢముగ నమ్మియుండెను.

అక్బరు చక్రవర్తి మరణానంతరము బాదాపు రెండు వందల సంవత్సరముల వఱకుఁ బైనిజెప్పిన రాజమతము జనుల లో మెదలుచుండినదిగాని, అది పిమ్మట రానురాను క్షీణించి యిప్పటికి నామమాత్రావశిష్టముగ నున్నది. ఆతని కాలమందే, హిందువులకును మహమ్మదీయులకును సేవార్హ పుణ్యా

క్షేత్రములు గొన్ని యేర్పడినవి. అక్బరు నియమములు గొన సాగుచుండిన కాలమంతయు హిందువులును మహమ్మదీయులును వైషమ్యములులేక తుల్యానురాగముతోఁ దమ యేలికను సేవించుచు రాచకార్యముల యందును బోరాటముల యందును దోడ్పడుచుండిరి. ఔరంగజీబు కాలమునందు మతాసహనముపేరి ఖడ్గమేర్పడి, జనులలోని యైకమత్యబంధమును ద్రెంచివైచినది.

1605-వ సంవత్సరము అక్టోబరునెల, సలీము 'జహాంగీర్' అను బిరుదముతో డిల్లీ గద్దియనధిష్ఠించెను; అప్పుడాతనికి 37-సంవత్సరముల ప్రాయము.

## జహాంగీరు.

పదునాఱవ శతాబ్దాంతమున నైరోపాఖండమునందు హిందూదేశమును గూర్చిన వింతకథలు వినవచ్చుచుండెను. ఒకానొకచక్రవర్తి హిందూస్థానమంతయుఁ దన యేలుబడిలోనికిఁ దెచ్చికొని యనన్యసామాన్యబుద్ధి వైభవమునఁ బరిపాలించుచున్నాఁడనుసంగతి యాఖండమునంతటను వ్యాపించెను. ఆచక్రవర్తిసహనభావమును గుఱించి వింతలైన కథలేర్పడినవి. ఆచక్రవర్తి క్రైస్తవులయెడఁ బక్షముగలిగి మెలఁగుచున్నాఁడనియు, ఆతఁడొక క్రైస్తవాంగనను బరిణయమాడెనని యు వారు దెలిసియుండిరి.

ఇంగ్లాండునందలి సహనమునన్నెట్టిదో యెఱుంగని జనులు, తాము మోటుదేశమని భావించియున్న తూర్పురాజ్యమునందు సహనము పరిపూర్తిగ నిండియున్నదనుటను వినునప్పుడు, వారు పరమాశ్చర్య నిమగ్నులైరి. ఆచక్రవర్తియొక్క పేరును ఆతని యోగ్యతయు నాదేశములోని వారికందఱికు సర్వసాధారణముగఁ దెలిసియుండెను. కొన్ని సంవత్సరములలోనే యాంగ్లేయులు మొగలచక్రవర్తిని ముఖాముఖి దర్శింపఁగలిగిరి. వారే విల్లియమ్ హాకిను అనునతఁడును సర్ థామస్‌రో అను నతఁడును.

విల్లియం హాకిన్స్ ఆగ్రాలోని మొగల సంస్థానమును దర్శింపఁగలిగెను. ఆంగ్లేయులకు హిందూదేశముతోడి సంబంధమును దెలుపు చరిత్రమునందీయంశము మిగులఁ బ్రఖ్యాతమైనది. మొగలచక్రవర్తిని సందర్శించిన యాంగ్లేయులలో విల్లియం హాకిన్స్ ప్రాథమికుఁడు; అక్బరు చక్రవర్తివలన నాతఁడు సమ్మానింపఁబడి హిందూదేశములోనాంగ్లేయుల వర్తకమునకైన యధికారమునుబొంది 1577-వ సం॥ మునఁ దన జన్మదేశముఁ జేరెను.

1607-వ సం॥ము, ఈస్టిండియా కంపెనీవారు, హిందూదేశానుభవము గలిగినవాఁడు విల్లియంహాకిన్స్ అని, ఆతనినే హెక్టారు నావ కధికారిగాఁజేసి యీ దేశమునకుఁ బంపిరి. ఇచ్చటికి వచ్చునప్పు డాతఁడు, తనదేశపు రాజైన మొదటి

జేమ్సునొద్దనుండి యందలి రాజులకొఱకు బహుమతులను శ్రీ ముఖమును దెచ్చియుండెను. ఆకాలమున యూరోపుఖండము వారిలోఁ బోర్చుగీజులు హిందూదేశమునందలి మిక్కిలి ప్రసిద్ధులుగనుండిరి. వారు, తమ వర్తకము చెడునను శంకతో నితరదేశస్థుల నిచటఁ జేరనిచ్చుటలేదు.

1608-వ సంవత్సరము, ఆగస్టునెల 24-వ తేది విల్లియం హాకిన్సు సూరతుఁజేరెను. అచ్చటనాతనికి- బోర్చుగీజులవలనఁ బెక్కుకష్టములు ఘటిల్లెను. ఆతని నావలను బట్టుకొనిరి; ఆతనియొద్దనున్న వస్తువుల నపహరించిరి. పోర్చుగీజుల క్యాప్టన్ మేజరొకఁడు హాకిన్సును మిక్కుటముగా నగౌరపించి పెక్కుదుర్భాషలాడుటతోడ ఆతని దేశమును అతనిరాజును గూడ నిందించెను. మఱియొక నావికాధికారి, 'ఈసముద్రమంతయుఁ బోర్చుగీజురాజు నధికారములోనిది; ఆతని రాదారి చీటిలేకయే యితరులు పయనము చేయరాదని నుడివెను. మొట్టమొదట ఆంగ్లేయులకు మొగలసార్వభౌముల రేవున నిట్టి మర్యాదజరిగెను.

హాకిన్సు, తన కష్టములకుఁ బ్రారంభదశ యదియని యూహించెను. పిదప నాతఁడు పెక్కుశ్రమలకులోంగి తుట్టతుదకు (1609-వ సం॥ము ఏప్రిల్ 16.) ఆగ్రా నగరమును జేరెను.

ఆతరుణమునఁ దొల్లి హాకిన్సు దర్శించి సంభాషించి యుండిన యక్బరు చక్రవర్తి గద్దియపై లేఁడు. జహాంగీరు (లోకజేత) అనుబిరుదముతో సలీము మొగల గద్దియనధిష్టించి యుండెను. ఆతఁడును దనసోదరులైన మురాదు దానియలుల వలెఁ ద్రాఁగుఁబోఁతుఁదనమున సుప్రసిద్ధుఁడు. చక్రవర్తి, తనకు సురాపానమునందలి మక్కువ వెల్లడిపఱచు నిమిత్తమే, మద్యపు గిన్నెను జేతఁబట్టుకొనినట్లు తనయాకారమును నాణెముల పై ముద్రించెను. అయినను, వయస్సెచ్చిన కొలఁదిని మద్యపానము మట్టు పడుచు వచ్చెను. అందులకుఁ గారణము, ఆతని జీవితేశ్వరియైన నూర్జిహాను యొక్కసదోబ్ధనయే.

ఆతఁడు సింహాసనమెక్కిన పిమ్మట, మిక్కిలి దెలివిదెచ్చికొని తన తండ్రివలెనే సహనభావముతో మెలఁగఁదొడఁగెను. యుద్ధకార్యములయం దతఁ డెన్నఁటికి వెనుదీసినదిలేదు. ఆతఁడు, తనతండ్రివలెనే హిందువులను క్రైస్తవులను సమదృష్టితోఁ జూచుచుండెను. కోపావేశపరవశుఁడు కాని సమయములయం దాతఁడు మిక్కిలి యుదారిగను జమత్కారిగను గానవచ్చును. ప్రజల కష్టనిష్ఠురముల స్వయముగాఁ దెలిసి మాన్పఁదలఁచి తానున్నచోట నొకగంటకట్టి దానికొక గొలుసు కట్టియుంచెను. వెలుపలనుండి యా గొలుసులాగి గంటమ్రోఁగించిరేని, తత్క్షణమే తా నచటికివెళ్లి వారి శ్రమల విచారించి పరిహారమొనగూర్చును. అటులుండియు నుద్యోగస్థులనువిూఁటి, చక్రవర్తి

తోఁ దమ క్రమల మొఱయిడుటకుఁ బ్రజలలో సాహసించిన వారెవ్వరును లేరు.

జహాంగీరు చక్రవర్తి, హాకిన్సురాకఁ దెలిసి, మిక్కిలి యాదరముతో నతనిని దనకడకు రా నానతిచ్చెను. నూరతు నందు విలువగల వస్తువులన్నియు నపహృతములగుటచే చక్ర వర్తికి నజరొసఁగ దగినదేదియు హాకిన్సునొద్ద లేదు. హాకిన్సు తన్ను చక్రవర్తిరాఁబట్టి కొనిన సందర్భమును గూర్చియిట్లు దెలుపు చున్నాఁడు:

"చక్రవర్తి మందహాసాంచితముఖుఁడై నన్నుఁజూడఁ గానే పక్షముతో స్వాగతముపలికెను. నే నతని గద్దియ యొద్దకుఁబోయి' (మారాజు) శ్రీముఖమొసఁగఁగా నాదరము తోఁ దానిని దీసికొని, దాపుననున్న వృద్ధుఁడైన పోర్చుగీజు జెసూతు చేతికిచ్చి చదువు మనెను. అతనితోడ్పాటున నందలి యంశముల గ్రహించి, 'ఈశ్వరసాక్షికముగ నారాజు కోర్కిని మనఃపూర్వకముగ జరుగనిచ్చెదనని వాక్రుచ్చెను.

"అంతట, చక్రవర్తి నన్నుఁదన యేకాంతహర్మ్యము నకుఁ బిలుచుకొనిపోయి, అచటనాతోడఁ జాలసేపు సంభాషిం చెను. నే నాస్థలము వదలిపోవునప్పుడు, 'ప్రతిదినము మీరు నాయోలగమునకు విచ్చేయవలయు'నని యానతిచ్చెను. హిం దూస్థాని భాషయందఱకును దెలిసియున్నప్పటికిని సంస్థానపు భాష పారసీకముగానుండెను. బాబరు చక్రవర్తికి మాతృ

భాష తురుష్కమగుటచే, అది యాతనివంశము వారికిని బంధువులకును దెలియును. నేను, తురుష్కభాషయందే చక్రవర్తితో సంభాషించితిని. అతఁడు, పిదప నాతో సంభాషించు నప్పుడంతయు నింగ్లాండు దేశమును ఇతర దేశములను గూర్చిన విషయములను వినుటయందు మిక్కిలి యుత్సహించును''

పోర్చుగీజు జెసూతుల • ప్రబలవిరోధమునకుఁ బ్రతిస్పర్ధిగా, రానురాను హాకిన్సునకును జక్రవర్తికిని స్నేహానుబంధ మతిశయింపఁ దొడఁగెను. ఒకప్పుడు హాకిన్సుకోరినవాని నన్నిఁటిని గొనసాగించునటులు, చక్రవర్తి తన జనకునిపై నొట్టుపెట్టి చెప్పెను. ''నే నాతని సంస్థానమునందే యుండినయెడలఁ 'జక్రవర్తి నాఫాక్టొరీకి వలయు సామగ్రులన్నియు నిచ్చియుండు' నని హాకిన్సు చెప్పియున్నాఁడు. హాకిన్సు, తన సంస్థానమునందేయుండిన నాతనికి సాలుకు ముప్పదిరెండువందల సవరనులును నాలుగువందల గుఱ్ఱములకు మనసబుదారీ యధికారము నొసఁగునట్లు వాగ్దత్తముచేసెను; అతనిని 'ఇంగ్లీసు ఖానుఁ'డని మక్కువతోఁ బిలుచుచు, తన గద్దియకు సమీపమున గొప్ప సరదారులుండునట్టి స్థానమునం దుండ నిచ్చెను.

ఇంగ్లీసుఖానునిఁ జూచినచోట పోర్చుగీజులు వెఱ్ఱికుక్కలవలె మొఱఁగఁదొడఁగిరి. ఆతనికిఁ జక్రవర్తి యొద్దనున్న చనవునుబట్టి యందఱును వెగటొంది యసూయపడిరి. ఇప్పు డింగ్లీసుఖానుఁడు, తనయునికిఁ బదిలపఱచుకొనుట కెంతో

ప్రయాస పడవలసి వచ్చెను. చక్రవర్తి, తననెయ్యుని స్థితిఁ గాంచి యాతనికి విసము వెట్టి చంపుదు రేమో యని వగచి, అన్నపానములను విచారించుకొను నిమిత్త మొక యార్మీని యనుస్త్రీ నొసఁగి పరిణయము చేసెను.

మొట్టమొదట సూరతుపట్టణమునం దాంగ్లేయ వర్తక శాల కట్టుటకానతి యొసఁగెను గాని, అందలి పోర్చుగలు గవర్నరు నిర్బంధమునకుఁజిక్కి, చక్రవర్తి రద్దుపఱచెను. వారి కలఁతలకు వెగటుపడి, 'ఇంకమా దేశములో నాంగ్లేయుఁడను గిడ రాదు' అని వేసటతోఁబలికెను. హాకిన్సు, జిహాంగీరునకు గొప్పబహుమతులు సమర్పించి యాతనిహృదయ మప్పటికి మార్పుఁ గలిగెను కాని యది చిరముగనుండలేదు. పోర్చుగలులు మిక్కుటముగఁ జక్రవర్తికి లంచములు సమర్పించిరి. అంత, హాకిన్సు, ఇంకచక్రవర్తిని నతని వాగ్దానములనుఁ గూర్చి నిర్బంధించుటవలనఁ బ్రయోజనములేదని తలపోసి, 1611వసం॥ము నవంబరు 2_వ తేది మొగల సంస్థానము వదలెను. మఱు చటిసంవత్సరమే తనజన్మదేశమునకుఁ బయనమై పోవుచు దారి లోనే మరణించెను.

తమప్రభువుల గుణలేశములను గొప్పఁజేసి, అతిశయోక్తులతోఁ బెంచివ్రాయుటయు దుర్గుణములఁ బేర్కొనక వదలుటయు హిందూదేశ చరిత్రకారుల యలవాటగుచున్నది. అట్లుగాక, హాకిన్సు తాను మొగలసంస్థానమున తాను గన్నది

కనినటులే వ్రాసెను. అంతేగాక పెంచివ్రాయుట కాతఁడు పండి తుఁడునుగాఁడు. కాఁబట్టి, చరిత్రకారులకు హాకిన్సు నభిప్రాయనుమూల్యమైనది. హాకిన్సు:—

"జహాంగీరుచక్రవర్తి తన ప్రజలతోఁ గలకలయిక గలిగి మెలఁగఁడు; జనులతనియెడల భీతిగలిగి దొలఁగి నిలుతురు; అతఁడు, గౌరవావహములైన యుద్యోగములను నధికారములను, మహమ్మదీయుల కనుగ్రహించును గాని, అంతఃక్రోధమును బక్షపాతమును వహించి రజపుత్రవీరుల యున్నతికోర్వఁడు. తనయేనుఁగులు, ద్రొక్కియుఁ జీల్చియు నపరాధులను జంపుచుండుటనుజూచి జహాంగీరుత్కటముగ సంతోషించును" అని దెలిపియున్నాఁడు. వారమునకుఁ గనీస మైదు దినములు గజములఁ బోరాడనిచ్చి యాభయంకర ఘోరదర్శనమునకు జహాంగీరు చాల సంతసించును. జహాంగీరునకుఁ దన కార్యదర్శి పై నేకోసం దేహము దోఁచినందునఁ దన చేతులార వానిఁ జంపివేసెనఁట; అటులే పరిచారకుఁడొకఁ డొకతట్టజారవిడిచి పగులఁగొట్టెనని మృతకల్పుఁడగునట్లు కొట్టెను. క్రూరమృగములతో మనుష్యులఁ బోరాడ నిచ్చుటయం దాతని కాహ్లాదమెక్కువ. నిరాయుధపాణులగు జనులను సింహములతోఁ బోరనిచ్చి, మనుజులామృగములచేఁ దుత్తునియలుగ ఛేదింపఁబడు వంతవఱకో పికతోఁ గనులుఁచల్లఁగఁ గాంచుచుండును.

ఇట్టిచేఁతలన్నియు క్రూర పరిపాలమున కంగములేగదా! గానురాను ప్రజలకుఁ బ్రభువునెడల వైరస్యమెచ్చఁ దొడఁగెను. రాజ్యమున దొంగలును దొమ్మిగాండ్రును బెల్లురేఁగిరి. తిరుగుబాటు లచ్చటచ్చట నతిశయింపఁ దొడఁగినవి.

జహాంగీరు దినచర్య యద్భుతమైనది: ఆతఁడు శయ్యనుండి లేవఁగానే ప్రార్థనాదికము నెఱపనొకగదిఁ జేరును; అచట శిలావినిర్మిత క్రీస్తువిగ్రహ మొకటియుండెను. ఈయహార్మ్యఖానుస్థానముదీర్చి తనకు సుప్రభాతముఁ బలుకు నిమిత్తమువచ్చి మూఁగియున్నజనులకుఁ దన్నుఁ గాన్పించికొనును. పిదప రెండు గంటలు దనుకఁ బరుండి నిదురించును. చక్రవర్తిలేచునప్పటికి భోజనము సిద్ధముగనుండును. అందు నైదాఱువిధములఁ బ్రేల్చినమాంసపుముక్క లుండును. చక్రవర్తి, వానిలో నొకముక్కను భక్షించి గాటయినమద్యమును బానముచేయును; అంతట నంతఃపురము వంకకు మరలును. అచ్చటఁ గొంతసేపుగడపి; మధ్యాహ్నవేళకు సభకువచ్చును. ఆగ్రాలోనున్న సరదారులును సామంతులును విచ్చేసి తమవిధేయతను వెల్లడిసేయుదురు. చక్రవర్తి తగవరుల తగవులను వానికారణములను సావధానముతో వినును. అంత, నరమృగముల పోరాటము మున్నగు సార్వభౌమున కాహ్లాదప్రదములయిన వేడ్కలు జరుగును.

పిమ్మట, జహాంగీరు సాయాహ్న ప్రార్థనాదికము నిర్వర్తింపఁ బోవును. అనంతరము సార్వభౌమునకు భోజనపుఁబని

యేర్పడును; భుజించి లేవఁగానే రహస్యసౌధమును గూర్చి పోవును. అప్పుడు తనతో నిష్టాలాపము లాడుటకుఁ దగినవానిని తానే నిర్ణయించుకొనును. తననిర్ణయమునకు మీఱి యన్యుఁడా ప్రదేశమున నడుగిడుటకు సాహసింపఁడు. విల్లియం హాకిన్సు ఒక్కదినము లాతని నోరుతోడుగ మెలఁగుచు వచ్చెనఁట.

రహస్యహర్మ్యమునందుఁ జక్రవర్తి యైదుగిన్నెలనిండుగ మద్యమానును. అంతకుఁ బైన ద్రాఁగినచో శరీరమునకు శ్రమము గలుగునని వైద్యులామేరయే విధించియుండిరి. వారియనుమతి చొప్పుననే చక్రవర్తి యెక్కువ త్రాఁగుటకు సాహసింపఁడు. గాని, నల్లమందు దానికిబదులుగఁ దినును. అంతట నాచోటు వదలి లేచును. అప్పటికి లాహిరి తలకెక్కి, తలయెత్తనీకచేసి వైచుటచే, జిహాంగీరుఁడు శయ్యఁ జేరును. మఱి రెండుగంటలకంతయుఁ బరిచారికలు భోజ్యవస్తువులఁదెచ్చి కైపుచే నోడలు మఱచియున్న చక్రవర్తినోటఁ దుఱుముదురు. ఇది నడురేయి యొకగంటవేళకు జరుగును. పిమ్మటఁ జక్రవర్తి నిశావశేషమును సుఖనిద్రచేఁ గడపును.

అక్బరుచక్రవర్తికిఁ బుత్రుఁడును, అతఁడధిష్ఠించియున్న యుత్తమసింహాసన మలంకరించినవాఁడునునైన జిహాంగీరు చక్రవర్తియొక్కదినచర్య యిట్టిది. ఆతనియొద్దకే సర్ థామస్ రో ఇంగ్లాండుదేశపు రాజుగారి రాయబారము నడపెను.

సర్ థామస్ రో, మొగలసంస్థానమును 1615వ సంవత్స రము జనవరినెలయందుఁ బ్రవేశించెను. హాకిన్సు చేయవలసి యున్న కార్యశేషమును 'రో' ముగింపునకుఁదెచ్చెను. సర్ థామస్ రో హిందూదేశమును జేరినప్పుడు ఆంగ్లేయులు మిగుల శోచనీయదశయం దుండిరి. వారిసౌకర్యముల కనువైన హక్కు లేమియు నిచటలేకుండెను; వారిని జూచినచోట నితరులు మిక్కుటముగ నవమానించుచుండిరి. వారేదైనను సౌకర్యము గలిగించుకొనవలసి యుండిన మితికిమీఱి లంచములిచ్చుకొను చుండిరి. స్థానికాధికారులు, వారియెడల నెంతమాత్రము గౌర వము గనఁబఱచుటలేదు; కూలివాండ్రు సైతము దిరుగఁబడు చుండిరి. వారిధనము దొంగిలుట యపహరించుట సర్వసాధా రణముగ నుండెను.

అట్టిస్థితినుండి తొలఁగించి యాంగ్లేయులకు నెమ్మది యొనగూర్చుటకు సర్ థామస్ రో తప్ప సమర్థుఁ డితరుఁడు లేఁడని భావించియే, ఈస్టిండియాకంపెనీ డైరెక్టరులు తమ రాజునకు మనవిచేసి యాతనిని రాయబారిగ మొగలచక్రవర్తి యొద్దకుఁ బంపికిరి.

సర్ థామస్ రో యెడల వర్తకపుఁ జాకచక్యమును వైదుష్యవిశేషమును వచోచమత్కృతియు నమరియుండినవి; సభ్యవర్తనుల కుండవలసిన శరీరసౌష్ఠవమును బరేంగి తజ్ఞాన మును బ్రతిభాతిశయము నతనికిఁగలవు. ఇంతేగాక, తనరాజ్య మునందును రాజునందును మిక్కుటముగ భక్తిగలవాఁడు.

సర్‌థామస్ ప్రయత్నములవలన సూరతునగరమునందలి యింగ్లీషువారి వర్తకశాల మంచిస్థితికి వచ్చినది. దాని ననుసరించిన యాంగ్లేయుల బాములు గొంతవఱకుఁ దీఱినవి.

జిహాంగీరునకు హాకిన్సు పరమమిత్రుఁడైనటులే, సర్‌థామస్‌రో యును బ్రాణస్నేహితుఁడుగ మెలఁగుచుండెను. హాకిన్సు తెలిపినవిధముననే తాను గన్నవిశేషములను రో తెలిపియున్నవాఁడు. అతని రచనమువలన జిహాంగీరుఁడు చిత్రకలాప్రియుఁడని తెలియవచ్చెడిని; జన్మదివసమున తులాభారముఁ దూఁగి బీదలకుఁ బంచిపెట్టునఁట.

జిహాంగీరుఁ డొకనాఁడు సాయాహ్నము నలవాటు చొప్పున సర్‌థామస్ రో తో సంభాషించుచు, చమత్కారోక్తులుపల్కుచు, 'నీవు దినమున కెన్నితడవలు మద్యపానము చేసెదవు? ఎంతత్రాఁగుదువు? ఎట్టిమద్యము నీమదికెక్కినది? బీరు అననేమి? దానినెట్లుఁ జేయుదురు? నీవిచ్చటదానిని జేయఁగలవా?' అని ప్రశ్నలడుగఁజొచ్చెనఁట.

జిహాంగీరునకు ఫకీరులయెడ నెక్కువభక్తి గలదఁట; మలినవస్త్రములు దొడిగిన యొక బిచ్చగానికిన తపంక్తి భోజనమిడి, యుపచరించి తుదకుఁ జక్రవర్తి యాతనిపాదాక్రాంతుఁడయ్యెనని సర్‌థామస్‌రో దెలిపియున్నాఁడు. రో, మొగలసంస్థానమును 1618-వ సంవత్సరమున విడిచెను. అటు పిమ్మట సంస్థాన చర్య విశదముగఁ దెలిసికొనుటకు వీలు గలుగలేదు.

అయినను, పీట్రో డెల్లావల్లి యను యురోపియను యాత్రికుఁడు, 1623-సంవత్సర ప్రాంతమున హిందూ దేశమునందలి అహమదాబాదు, కాంబేమున్నగు మండలములు యాత్రచేయుచుండెను. ఆతఁడు ఆగ్రానగరమును దర్శింపకున్నను జక్రవర్తినిగూర్చి తాను వినియున్నంతవఱకు స్పష్టపఱచెను. అతఁడు, 'ముహారీసీసా (స్త్రీరాజన ముద్ర). లేక, నూర్‌మహల్, అనెడి నూర్జహాను మిగులఁబ్రఖ్యాతి వహించినది. ఆమె ఆలోచననుసరించియే హిందూస్థానమంతయుఁ బరిపాలింపఁ బడుచున్నది. ఆమె, యొకపారసీక నాయకునకుఁ బుత్రికయై, మొగలరాజ్యమును జేరినయొక పారసీకనాయకునిఁ బెండ్లియాడినది. ఆమె విధవయైనపిదప సలీమునకుఁ బత్నియాయెను. పిదప నామెయే యతనికిఁబట్ట మహిషిగనేర్పడినది. అంతఃపురమునను రాచకార్యములను ఆబిడయాజ్ఞ శిరసావాహ్యముగ నున్నది. రాచకార్యమునం దాబిడ పెక్కు దిద్దుబాటులఁ జేసెను'' అనినుడివెను.

''నూర్జహాను, సామ్రాజ్యమును సంబంధించిన సర్వవిషయములయందును జోక్యము గలిగించుకొని యుండెను. జిహాంగీరుఁడు నామమాత్రా వశిష్టుఁడైన చక్రవర్తిగా మెలంగఁ దొడఁగెను. అతఁడు, నూర్జహాను చేతిపరికరముగనుండి, ఆబిడ మెట్లుత్రిప్పిన నటులు దిరుగుచుండెను. ''నూర్జహాను బేగము, రాజకార్యములు జరుపునంతటి తెలివి తేటలుగలది. నాయానంద పరిపోషణార్థము నేను గోరఁదగినవంతయు నొక

గిన్నెఁడు మద్యము నొక మాంసపుముక్కయునే'' అని యా తఁడు పలుతడవలకుఁ జెప్పుచుండును. జిహాంగీరుఁడు చెప్పు ననువుననే నూర్జహాను ప్రజానురాగ మత్యంతము సంపా దించియుండెను; ఆబిడ, తన యాశ్రితులయెడలననుకంపయు నౌదార్యమును గనఁబఱచుచు వచ్చెను; మొత్తమునకా బిడ, దరిద్రులకుఁ గల్పమహీరుహము వంటిది. బేగము, తన స్వంత ధనము వెచ్చపెట్టి బీదకన్నియలకుఁ బెండ్లిండ్లు చేసియుం డెను. ఆమెయాదరమునకుఁ బాత్రలైన కన్నియలు ఐదువం దలకంటె నెక్కువగానేయుండిరి'' అని జిహాంగీరు చరిత్రకా రుఁడైన మహమ్మదు హాది చెప్పుచున్నాఁడు.

పారసీక యోషిన్మణియైన నూర్జహాను బేగమునందుఁ జక్రవర్తి వహించియున్న గౌరవాతిశయ మనిర్వాచ్యము; అతఁడు, తనప్రేమ వెల్లడియగునటులు టంకముపైఁ దనతోడ నాబిడ విగ్రహమును ముద్రించుచు వచ్చెను. బేగ మొకనాఁడు టంకసాలపై నధికారమువహించి రాశీచక్రసంబంధమైన మొహ రులును గొట్టించెను.

మనహిందూదేశమంఁదు, బీదలయిన పురుషు లెందఱో తమ శౌర్యౌదార్యాది గుణములచేత సార్వభౌములయి ప్రజా పరిపాలనముచేసిరనుట కెన్నోయుదాహరణము లున్నవి. పౌ రాణిక కాలమునందు, సూతునిచే సాఁకబడిన కర్ణుడు, అంగ రాజ్యమున కధిపతియయ్యెను. ఐతిహాసిక కాలమందలి బుక్క

రాజు, శివాజి, హైదరాలి, బాలాజీ విశ్వనాథుఁడు మొదలగు వారు తమ సామర్థ్యమున రాజులయిరి. అయినను, ఇట్టి యుదాహరణములు స్త్రీలయందుఁ జాలతక్కువ. ఆంధ్రులయందు రుద్రమదేవిగారును, మరాటాలలో తారాబాయియును అహల్యాబాయియును ప్రసిద్ధలు. అటులే ముసల్మానులందు ఛాఁద బీబీప్రఖ్యాత. వీరు, రాజులను సంబంధించిన వారగుటచే రాజ్యపరిపాలనమును విరోధులనెదిరి పోరుటలును సర్వసాధారణములైనవి. బీదలైన తలిదండ్రులకుఁబుట్టి సార్వభౌమునకు రాణియై తనయ ప్రతిమానబుద్ధి కుశలతలచే మహాప్రఖ్యాతిని వహించిన నూర్జహాను రాణిచరిత్ర మత్యంతము మనోరంజకమైనది. కాఁబట్టి, ఇచట నాప్రతిభాశాలినిని గూర్చి సంక్షేపముగఁ దెలుపుట యావశ్యకము.

పదునాఱవ శతాబ్దికడపట 'ఇరాన్' దేశమును ఇస్మాయల్ అను పేడిరాజొకఁడు పరిపాలించుచుండెను. ఆరాజ్యమందప్పుడు స్వాస్థ్యముచెడి కలఁతలతో మెండుకొని యుండెను. అచ్చట గౌరవనీయులై యున్న మంచి కుటుంబములవారు, తమ దుస్థితిని దలఁచి జన్మభూమిని వదలి పరదేశములకు వలసపోయి ప్రాణములు కాఁపాడుకొనవలసిన దురవస్థ తలచూపెను. ఆ కాలమందు, హిందూస్థానమును అక్బరుచక్రవర్తి పరిపాలించుచున్నాఁడనియును, ఆతఁడు మేధాసంపన్నులయిన పరదేశీయుల కాశ్రయదాత యనియును వారికిఁ దెలిసియుండెను. కాఁబట్టి,

సాహసి కాగ్రగణ్యులెందఱో తమకుఁదలచూపియున్న యిబ్బం
దులకు నిడుమ్మలకు మిగుల వేసటనొంది హిందూస్థానమందుఁ
బ్రఖ్యాతినొంది జీవింపవలయునను తలంపుతో వచ్చుటకు మొద
లిడిరి. వారిలో ఖాజా అయ్యాస్ (మిర్జాగియ్యాస్ ఉద్దీను) అను
వాఁడొకఁడు. వాఁడు గొప్పవంశమును జేరినవాఁడయ్యును,
గర్భదరిద్రుఁడు. వాఁడు నిండుచూలాలయిన తన భార్యను
పెద్దకొమారునిఁ బిలుచుకొని హిందూస్థానమును గూర్చి పయన
మయ్యెను. దారిలో వాని భార్యయొక యాఁడుబిడ్డనుగనెను.
ఆదంపతులాశిశువును పోషించు నంతటి స్థితిలో లేనందున,జీవ
ములు గట్టిగానున్న నెటులయినను బ్రదికిపోవునని నిశ్చయించు
కొని యచ్చటనే దిగవిడిచిపోయిరి. అల్లు కొంతదూర మేఁగిన
పిమ్మట, వారికాశిశువును అగతికగా విడిచిపోవుటకుఁ గాలాడక
పోయెను. కావున. తిరిగివచ్చి యా బిడ్డనెత్తుకొని ముందుకు
సాగి ఆగ్రా నగరమును జేరి రని చెప్పెదరు. ఈసంగతియందు
సత్యాసత్యము లెట్లున్నప్పటికిని ఖాజా అయ్యాసు ఆగ్రానగర
మును జేరి యక్బరు నాశ్రయమునుపొంది యున్నప్పు డతని
కొక్క సంవత్సరపు స్త్రీ శిశువుండినది యదార్థము: ఆశిశువే
యిఁకముందటికి నూర్జహాను మహారాణియని ప్రఖ్యాతినొందెను.

నూర్జిహాను బాల్యపుఁబేరు ముహార్ఁనిసా: ఆమె
తండ్రియగు ఖాజా-అయ్యాసుఁడు, అక్బరు చక్రవర్తి సంస్థా
నమం దెచ్చుగ గాగవింపఁ బడుచుండినందున, ఆతఁడు తన

కూఁతురికి రాచకన్నెలకు నవశ్యమయిన విద్యల నన్నింటిని నేర్పెను. ఆ బిడ గానమందును చిత్రకళయందును గవిత్వము చెప్పుటయందు నప్రతీకురాలై యొప్పెను. కాఁబట్టి యాబిడ సౌందర్యాతిశయము బంగారమునకుఁ దావియబ్బి నటులు ప్రకాశించెను. మఱియును, చక్రవర్తియొద్దనున్న గొప్ప సరదారుల కొడుకు లాబిడను బరిణయమాడవలయునని మిక్కుటముగఁ బ్రయత్నించిరి. అట్లు యత్నించినవారిలో చక్రవర్తి కొడుకైన సలీము నొక్కఁడయ్యెను. ఒకనాఁడు సలీము, భోజనవేళ నామెనుజూచి, ఆబిడ సౌందర్యాతిశయమునకు నద్భుతమొంది యెటులైన నామెను।పొందవలయునని రేయింబవళ్లు వేఁగఁజొచ్చెను.

ఈ సంగతి, అక్బరు చక్రవర్తికిఁ దెలియవచ్చెను. అతఁడు దానినితనకొడుకు పెడ్లి చేసికొనుటకు సమ్మతింపలేదు. ఇందులకుఁ గారణ మిట్టిదని చెప్పుటకుఁ దగిన యాధారములు లేవు. ఆ బిడను వివాహాము చేసికొన్నటులయిన తన తనయుఁడు రాజ్యపుఁ దగులమువదలి యా బిడవలకుఁ జిక్కిమగ్నుఁడై పోవునను భయముచేతనో, అంతకుమున్నే తన మఱిఁదియైన రాజామాన్ సింగు కూఁతురుని వానికి నిశ్చయించి యుంచినందుననో ఊహింప నశక్యము. మొత్తమునకు చక్రవర్తి కాబిడను గోడలిని జేసికొనుట కిచ్ఛలేక పోయెను. అంత, అక్బరు చక్రవర్తి యాకన్యను దన సరదారులలో బీదగా

నున్న ఆల్లీకులిబేగ్ అనువాని కిప్పించి, ఆదంపతులను తన రాష్ట్రమునకు దూరముగానున్న బరద్వాన్ ప్రదేశమునకుఁ బంపివేసెను.

ఆసందర్భమున సలీము మెహరీనిస్సా యనువారియొక్క నిరీక్షణము లెటులుండెనని యూహించుటకు మనకాధారము



లేవియును లేవు. అయినను సలీము ఆమెను పొందుటకుఁబొంచియున్నాఁడనుట అతని పిమ్మటి కార్యములచేఁ దెలియవచ్చు చున్నది. దైవయోగమున సలీము పెక్కేండ్లాబిడను గూర్చి నిరీక్షించుచు వెతనొందవలసి యుండలేదు. ఏలనఁగా, ఆ బిడకు పెండ్లిజరిగిన పిమ్మట నొక సంవత్సరము లోనే యక్బరు కాలగతినొందెను. వెంటనే, సలీము 'జహాంగీరు' (ప్రపంచజేత) అను బిరుదముతో ఢిల్లీ సింహాసనమధిష్టించెను. (1605-వ సంవత్సరము అక్టోబరునెల 21-వ తేది). తాను చక్రవర్తి పదవికి రాఁగానే యా బిడను పొందఁగోరి యనేకములైన కుట్రలను పన్నెను. ఆ ప్రయత్నములన్నియును బొత్తిగ నిష్ప్రయోజనము లైనవి. పిమ్మట జహాంగీరుని ప్రియమిత్రుఁడైన కుతుబ్ అనెడి యొక సుబేదారుఁడు బరద్వానకుఁబోయి యచ్చటనున్న మెహరీనిస్సా పెనిమిటియైన అల్లీకులిబేగుతో